

చెన్నపట్టణము, సెప్టంబరు ౧౯౩౦

సంపుటము ౭ ప్రమోదూత సంవత్సరము భాద్రపదమాసము సంఖ్య ౯

# హంపీక్షేత్రము

కొడాలి వెంకటసుబ్బారావు, బి. ఏ., శామరాజుగడ్డ శివయోగానందరావు గార్లు

## కనకాభిషేకము

"గణగణ మ్రోయు ఢక్కయది కంచుదియుంట చతుఃశ్రుతి ప్రచా
రణమున వ్యాసహాని యట రాయలు మెచ్చిన కింకహీంద్రవా
రణ మృగరాజ మంట భళిరా మన డిండిమభట్టు వానిపే
రణచగ వచ్చెనా యిక డహాంకృతి రూపము నెత్తలేదుగా."

అనువారు "ఇతడిటయ్యా రెడ్లకవిరాజు డిండిమభట్టు నోడించు చిన్న
యొక్కటియు గనరాకున్నది వేషము దక్క లేదేమొ వాదనకు శక్తి"
యనువారు నై ప్రజ లంతెంత పొంచి చూచెడువారునై వెంట నడచుచుండ
విద్యానగిర రాజవీథుల నిసుక చల్లిన నేలపైన రాలినది లేక

శారదాంఘ్రిద్వయార్చనాంభోరుహంబు-వికసితంబైన మనసులో వేవెలుంగు
తేజములు నిండిపోయి మదేభగామి-ఆంధ్రకవిరాజు శ్రీనాథు డరుగుచుండె.

"ఆగమంబుల నిధియైన విప్రుడు తల నేదయ్య జుట్టు గోష్పాదమంత
శైవమతాచారసారాధ్వగుం డట కనరాదు పో లింగకాయ మెడను
కవిరాజ బిరుద శంఖస్వన ప్రేరితు డామంత్రివేష మట్లావహించె
శారదోపాసనాధార దిగ్జయుడంట పెట్టలేదు ముఖాన-బొట్టుగాని
ఈవిరుద్ధప్రవృత్తి తా నెటు జయించు-ద్రవిడ ధాత్రి మహావాణి తాండవించు
గౌడ డిండిమఋషి"నని "చూడవలెను-ఈవిచిత్రంబు"నని ప్రజ లేగుచుండ్రి.

తనవెంట వచ్చు శిష్యుని గాంచి నవ్వును ఈప్రజ యూహ గ్రహించినట్లు
తన వైరిదైనవాదన నూహచేయును తనలోన తానె వాదనల పెంచి
తనకవిజయదీక్ష ననుభవించిన పూర్వవిషయస్మృతుల నిష్ఠ వెరగుపడును
తనగెల్పులోన పొంగును రెడ్డిరాజుల ఆదరణాంభోధి యనుచు మరియు
దైవవశమున నోటమి తనకు కల్గు-నేమొ యను కించ కించిత్తు నెరుగబోని
తెలుగుకవిరాజు రాయల కొలువునందు-చరణమును మోపె సభయు నిశ్శబ్ద మపుడు.

డిండిమభట్టు కీర్తిని గడించుటలో ముదితేరినాడు త
త్కాంచితి దక్షిణాపథ విభావరి వెన్నెలలారబోసె మా
ర్తాండుని తేజ ముట్టిపడు తన్ముఖమండల మామహాత్ముపై
దండుకు వచ్చినాడు ఫలితం బనుభూతము కాదె వీనికిన్.
అని మనసులోన తలపోయు నవనిపతిని-దక్షిణకరంబు పైకెత్తి దంతదీప్తు
లావరింప మహాసభ నాకవీంద్రు-డాశుధారల నాశీస్సు లాడినాడు.

"పంపావిరూపాక్ష బహుజటాజూటికారగ్వధ ప్రసవ సౌరభ్యములకు
తుంగభద్రా సముత్తుంగ వీచీఘటా గంభీర ఘుమఘుమారంభములకు"
పూర్వాంధ్రరాజ్య సంపూర్ణశౌర్యానల ప్రత్యక్షపుణ్యప్రభావములకు
హిందూమతోద్ధారణేందూదయ వికాసచాలితాధ్యాత్మ ప్రచారములకు
గౌడ డిండిమభట్టుదా కంచుఢక్క-మోది పగిలించు సర్వవాగ్వాదనలకు
మనసుపడి ప్రౌఢరాయల మందిరమున-నడుగు పెట్టిన కవిరాజు నయ్య నేను.

"వచియింతు వేములవాడ భీమనభంగి నుద్దండలీల నొక్కొక్క మాట
భాషింతు నన్నయభట్టు మార్గంబున నుభయవాక్ప్రౌఢి నొక్కొక్క మాట

పలికింతు తిక్కయజ్వ ప్రకారము రసాభ్యుచితబంధముగ నొక్కొక్కమాటు
పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరుని రేవ సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు
వ్యాసమునివోలి వాల్మీకి వాక్కువోలి-కాళిదాసునివలె హర్షకవినివోలి
ప్రతిపదరసోదయంబు నాపలుకు తెలుగు-నాయకా! నన్ను ప్రజలు శ్రీనాథు డండ్రు.

వేదార్థంబులవాదమో కవితలో వీణాశ్రుతుల్ నింపుటో
లేదా తర్కము సీతిసూత్రముల నాలింతో మరేదో వృథా
గాదాకాలము ఊరకున్న సెలవీగా వేడెదన్ డిండిముం
డేదన్నన్ సరి సిద్ధమే పగులవేయింతున్ ప్రభూ, ఢక్కలన్.

గౌతమీనది పొర్లి గారవించినదయ్య రాణ్మహేంద్రమున నారాగము విని
వేగీమహావీథి పెదజల్లినారయ్య ముత్తైదువులు చూపుముత్తియముల
బంగారుపళ్లెము బంతిభోజ్యంబులో విస్సన్నమంత్రి సేవించినాడు
నన్ను స్వీయచరిత్ర నెన్నుకోరాదయ్య క్రొత్తవాడనుగాన కొంతచెప్ప
వలసెనను కవివంకకు తెలుగురేడు-చూచె డిండిమభట్టును చూచె తిరిగి
రణము వాక్కులలో విజృంభణము పెరిగె-గ్రుక్కత్రిప్పకో వీలులేకుండె సభకు.

"వేదాలు తలక్రిందు వెలిగించినాడంట మాకైన రాదు యీమాటకేల
తర్కశాస్త్రాంబోధి తరియించినాడంట-యీయుక్తికి జవాబు సేయడేల
కవితలో వాణిరెక్కలు కట్టినాడంట అతని ధారాశుద్ధి కందదేల
పాతంజలంబు సంపత్తి పీనిదెయుంట సూత్ర విరుద్ధ మిచ్చునదియేల
డిండిముడు పూర్వరూపము డించినాడొ-కాక పుంభావవాణిగా కవి యితండు
పుట్టెనో భూమిపై"నని పొగడుసభ్యులా వివాదంబు పదపద మందుకొనుచు.

వాగర్థంబులలో ప్రమాణములలో వాదంబులో సూత్రచ
ర్చాగాంభీర్యములో కవిత్వమధుధారావేగ విభ్రాంతిలో
"బాగో యీకవిరాజు యింతటి ప్రభావంబున్నదం చెంచలే
దే గర్వంబనుకొన్న నీపలుకు లన్నీ సత్యమున్ జేసితో."

అనిరి పండిత సభ్యు లందందలేచి-జయజయార్భటులందు వర్చస్సు డింది
పాలిపోయిన డిండిమభట్టుబిరుద-కంకణములెల్ల తెగగొట్టగా నృపుండు.

అనుమతి నిచ్చె డిండిము డహంకృతి చచ్చిన సాధుపండితుం
డనిమెడిరీతిగా నిలిచి యాసభలో పలికెన్"ప్రశస్తిన.

ర్తనులుజయాజయంబులవిధంబు గణింపరు నన్ను గెల్చినా
డని మొనికించలేదు వినయాధికుడన్ కవిసార్వభౌమునిన్.
నన్నుమించిన వానిగా నెన్నుకొందు-బిరుదములు తీసివేతును భేరి నిచట
పగులగొట్టింతు"నని చెప్పి బయటికరిగె-విజయ ఘోషలు సభలోన వెల్లి విరిసె.
"జయ కవిరాజ నీవిజయ శాసనముల్ లిఖియింతు రాంధ్ర వా
ఙ్మయచరితన్ సువర్ణఫలకంబులపై నిను బట్టి నాడు ను
న్నయది తెలుంగు సంస్కృతి యనారత"మంచు వచించుచున్ కర
ద్వయమును మోడ్చి డిండిముడు వచ్చెను లోనికి కంచుఢక్కతోన్.
అది పగిలించినారు వలయంబులునై విరళీకృతంబులై
కదలెను శబ్దముల్ తెలుగు కావ్యసరస్వతి నూపురంబులో
యు దినము లింకనున్నవనుచుండిరి సభ్యులు రాయలున్ సభా
సదులనుచూచి పల్కెను ప్రశాంతవచస్కుడమోఘ వాక్కులన్.
"ఏనాటిదో ఢక్క యిపుడు ముక్కలుగాను పగిలిపోయెను చింతపడ డితండు
ఎట్టిగంభీరుడో యిట్టిగెల్పులు పొంది కవిరాజమాట నొక్కటియు ననడు
ఇరువురును సమర్థులే శక్తియో రెండుమూర్తులు దాల్చెకాబోలు లేక
ఇట్టిమహాప్రజ్ఞలెచట వింటిమి గాంచి ధన్యులమైనాము తలచుకొలది
విస్మయముగొల్పు కథను జూపించినారు-మీ కవిత్వప్రశంసలో నాకుగూడ
స్థానము నొసంగినారు వాఙ్మయచరిత్ర-ప్రౌఢరాయలసభ పేరు పలుకుగాన.
ఇరువురు గౌరవార్హులె జయించినవారలు కొంత యెక్కువా
దురుగద నా బహూకృతులతో పనిలే దకలంకమూర్తులా
గురులకుగాని యీమనుజకోటి స్వభావము మార్చుకోదు దు
ర్భరముగ దెప్పిపోయును ప్రపంచకవై ఖరులెల్ల చిత్రముల్.
కాన సంభావనకై యిచ్చుతృణమేని వేరువుగా నెంచగోరినాను
కవులార"యను రాజు గద్దెపై నాసీనుడయ్యె భటుల్ విచిత్రాభరణము
లంబరంబులు కానుకలమితముల్ గొనితెచ్చి నృపమౌళి యాజ్ఞానిరీక్షకులయి
నిలిచియున్నారు సభ్యులు రాయ లింతగా నొప్పబల్కెనయని యుబ్బిపోయి
నృపుడెవరి నెట్లుగా సత్కరించునోయని-గ్రుక్కిళులు మ్రింగుకొనుచును గూరుచుండ్రి
నవ్యకవితాసునాథు శ్రీనాథసుకవి - యూహా లంభోధివీచులై యూగుచుండ్రి.

“పదిపదునాల్గుశాస్త్రముల పారము ముట్టినవన్ను ఢక్కతో
నదిమినమేటి కర్హమగునట్టి బహూకృతి యీమహాసభా
సదనములోన పండితులసన్నిధి బంగరుగద్దెమీద చే
యుదె కనకాభిషేకము ప్రభూత్తమ, డిండిమగర్వహారికిన్”
అని వచియించె డిండిము డయత్నముగా సభలోన పైడిగ
ద్దె నిలిపి హేమటంకముల దెచ్చిరి రాసులు పోసినారు రా
జును తనగద్దె డిగ్గి పిలుచున్ కవిరాజును కేలుపట్టి లే
చెను పరిపూర్ణహర్ష వివశీకృతుడై కవిరాజపూజకై.

బంగారుకొండపై పరమనిష్ఠాగరిష్ఠుండైన శివమూర్తి శోభదోప
శ్రీనాథకవిరాజు చిరునవ్వుతో హేమసింహాసనమున నాసీనుడయ్యె
పార్శ్వాల డిండిమభట్టు రాయలు నిల్చి దోసిళ్లతో నెత్తి రాసిలోని
పైడిటంకంబులపై పోయుచుండిరి సభ్యులు పవనలు చదువుచుండ్రి
ఏమహారాజుపొందని యీయపూర్వ గౌరవంబున శ్రీనాథకవి మునింగి
విజయనగర సామ్రాజ్యము విస్తరిల్లు - ప్రార్థనలలోన తన భావఫణితి నిలిపి.

దీనారటంకాల తీర్థమాడించితే దక్షిణాధీశు ముత్యాలశాల
పగులగొట్టించితే భయదవాదప్రౌఢి గౌడడిండిమభట్టు కంచుఢక్క
విహరింపజేసితే వీరభద్రారెడ్డి విద్వాంసుయశము దిగ్వీథులందు
పలికింపజేసితే బహుళాంధ్రజనసభా భాస్వరుండనుచు ప్రపంచకంబు.

మందర మహీధరాధరమథ్యమాన దుగ్ధపాథోధిలహరికోద్భూతమైన
లలితసాహిత్యసౌహిత్యలక్ష్మి నొసగి సరససద్గుణనికురంబ శారదాంబ.

తెలుగుప్రజల్ ధరిత్రి రవితేజము వెల్గిననాళ్లు సంపదల్
కలిగినవారునై సుఖముగా వసియించెడివారునై మహా
త్ములు స్తుతియించువారునయి పొందుదురమ్మ స్వతంత్రమున్ భవ
ద్బలమునటంచు దీవనలపల్కుచు లేచె సువర్ణతేజుడై.

విజయనగరాంధ్రలోక మావేళ కవిత-కన్నకానుపు ముత్యాల కాంతులందు
తెలుగుభాషాసరస్వతి నిలుచుకొనియె-పైడిటంకాల కట్టులతోడి నగలు.

---

# మోచాకుసుమామోద విచారము

'కళాప్రపూర్ణ', 'మహామహోపాధ్యాయ' శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు

"మోచాకుసుమామోదసువాసిత
మలయనగాగతమందానిలమున"

అని శ్రీ ధర్మవరము రామకృష్ణమాచార్యులవారు చిత్రనళీయనాటకంబునం బ్రయోగించియుండ, శ్రీపూండ్ల రామకృష్ణయ్య పంతులవారు మోచాకుసుమమన నేపుష్పమని కృష్ణమాచార్యులవారిని జాబున నడుగఁగా, ఆచార్యులవారు నిఘంటువులందు మోచాశబ్దమునకుం గల వృక్షార్థములన్నిఁటిలో నొక్కొక్కటి యుత్తరముగా నొక్కొక్కజాబున వ్రాయుచు, కడపటను లేమిచే నేదియు సరిపడక తమకుం దెలిసిన దంతియ యని తుది జాబున వ్రాసి విరమించిరి.

మోచార్థములలో నరఁటి యొకం డగుటచే, శిలీంధ్ర మనఁగా నరఁటిపువ్వని అకారాది నిఘంటువుల నుండుటయు, శిలీంధ్రమునకుం బరిమళమును మాఘకవి చెప్పియుండుటయుం బరికించి అరఁటిపూసత్తావి యను నర్థమున మోచాకుసుమామోదప్రయోగము సమంజసము యని ఈనడుమ కొందఱు వాదింప సమకట్టినారు.

శిలీంధ్రమన నరఁటిపూవు గాదనియు దానం జేసి, మోచాకుసుమామోదప్రయోగము పూర్వోక్తమార్గమున రక్షణీయము, ప్రకారాంతరమున నేనియు రక్షణీయము గాదనియు నా యెన్నిక. గుణ మున్నచో విద్వద్వరేణ్యులు హర్షింతురని యెంచి వార్దింతా ప్రీత్యర్థమై నా యభిప్రాయమును సోపపత్తికముగా వివరించుచున్నాఁడ:

శిలీంధ్రప్రస్తావము ప్రాచీన మహాకావ్యంబుల నివ్విధంబునం గన్పట్టుచున్నది:—

శిలీంధ్రము (=కందళీపుష్పము) కేవల వార్షికము.

మాఘము, ౬ (౩౨)

నవకదమ్బరజోఽరుణితామ్బరై
రధిపురన్ధ్రి శిలీన్ధ్రసుగన్ధిభిః,
మనసి రాగవతా మనురాగితా
నవనవా పవనాయ్యభిరాదధే.

వ్యా. శిలీన్ధ్రాణాం కన్దళీకుసుమానామ్....'కన్దల్యాంచ శిలీన్ధ్రః స్యాత్' ఇతి శబ్దార్ణవే.

మాఘము, ౬ (౩౦)

ప్రవసతస్సుతరాముదకమ్పయత్
విదళకన్దళకమ్పనలాలితః,
నమయతిస్మ వనాని మనస్వినీ
జనమనోనమనో ఘనమారుతః.

వ్యా. కన్దలీ=భూకదలీ 'ద్రోణపర్ణీ స్నిగ్ధకన్దా కన్దలీ భూకదళ్యపి' ఇతి శబ్దార్ణవే. తస్యాః పుష్పాణి కన్దళాని. పుష్పమాత్రే బహుశోఽమి ప్రయోగః.

మాఘము, ౬ (౬౨)

ముదమబ్దభువా మపాంమయూరా
స్సహసా యత్తనదీపపాటలాభే,
అళినా రమతాళినీ శిలీన్ధ్రే
సహసా యత్తనదీపపాటలాభే.

వ్యా. శిలీన్ధ్రే=కన్దలీకుసుమే.

గౌడవహము, శ్లో. (౨౫౫)

ధారాహయధరణీణావరుద్ధ
ణాకన్దలీసిహోఘరుపమ్,
మహురమవగాఢసోహం
చవహాని విసమారుణం అహరమ్.

గౌడవహము, శ్లో. ౧౧౭ (౩౮౩)

ఉమ్మా ఉ ణగిరియడం
సీమాణివ్వాడికుకన్దలుచ్ఛేయమ్,

వాఞ్ఛత్యవిరళధారా
బద్ధరతియ రయం ధరణివేధమ్.

గౌడవహము, పే. ౧౬౯ (౬౪౭)
ధారాభిస్తిమితకన్దళాని
ఇహ హసన్తి మాలాః,
జరఠకలవిశ్రాంగకళ
మగ్నాభాహిణీలాజలహారాః.

గౌడవహము, పే. ౧౭౧ (౬౫౩)
ఉత్కన్దళాన్యనేక ఇ
ఇహ నేత్రిహారళీయకే పరకణాః,
గన్ధో ఉద్బుద్ధకలమ్బ
సీయలో నేలకదమ్బానాం.

బాలభారతము, పే. ౨౦౨ (౬౨)
[వృష్టిర్ విరమతాపికదాచి
తృష్ణయే ఽతుపరతాం పతగానామ్,
అమ్బుచామముచిరే జలవాహా
స్తుఙ్గపాదపదశేషు పతన్తః.]

బాలభారతము, (౬౩)
గన్ధలీనమధుపై రరుణత్వం
ధారయద్భి రభితో ఽపి శిలీన్ధ్రైః
భూషితా మరకతోపలమిశ్రైః
రత్నభూమణిగణై రివ భూమిః.

భోజచంపువు, కిష్కింధాకాండము.

పే. ౨౭౭ (౫౪)
అమ్బుజకదమ్బకబలితామ్బరాం
శిలీన్ధ్రసంబన్ధబన్ధుర వసున్ధరామ్...
ప్రావృషేణ్యాం ప్రక్రియామ్...

వ్యా. శిలీన్ధ్రసంబన్ధేన = కన్దళీకుసుమసంగత్యా-
కన్దళ్యాం చ శిలీన్ధ్రస్యాస్తి ఇతి శబ్దార్ణవే.

శార్ఙ్గధరపద్ధతి; వర్షావర్ణనము; పే. ౫౮౫(౪)
ఆకర్ణయ స్మరయోధ వరాజ్యపటహం
జీమూతధీరధ్వనిం

నృత్యత్కేకికుటుమ్బకస్య దధతం
వాద్యాశ్రీం మృదఙ్గక్రియామ్,
ఉన్మీలన్నవనీలకన్దళదళ
వ్యాజేన రోమాఞ్చితో
హర్షేణేవ సముచ్ఛ్రితా వసుమతీ
దధ్రే శిలీన్ధ్రధ్వజాన్.

శార్ఙ్గధరపద్ధతి; వర్షావర్ణనము; పే. ౫౮౬ (౧౦)
మన్దమన్దదితపాంసవః పరిపతజ్ఝంకారిఝఞ్ఝామరు
ద్వేగధ్వస్తకుటీరకాగ్రనిపతచ్ఛిద్రేషు లబ్ధాన్తరాః,
కర్మవ్యగ్రకుటుమ్బినీకుచభర ప్రస్వేదభేదచ్ఛిదః
ప్రారభ్యన్త ఇదంయ నిక్కన్దళోల్లాసాంపదోమాబిన్దవః.

శార్ఙ్గధరపద్ధతి; వర్షావర్ణనము; పే. ౫౮౭ (౧౪)
ఉన్నిద్రకన్దళదళాన్తరలీయమాన
గుఞ్జన్మదాన్ధమధుపే నవమేఘకాలే,
స్వప్నే ఽపి యః ప్రవసతి ప్రవిహాయ కాన్తాం
తస్మై విహారరహితాయ నమోఽస్తు పాయ.

ధర్మశర్మాభ్యుదయము, పే ౭౯ (౩౨)
ఫలవద్ద్విజరాజమపి క్షిపన్
దళితమిత్రగణో నవకన్దళః,
అజని కామకుతూహలినాం పునా
రసమయస్సమయస్స ఘనాగమః.

కావ్యాదర్శము, పే ౧౧౦ (౧౧౭)
వికసన్తి కదమ్బాని స్ఫుటన్తి కుటజద్రుమాః,
ఉన్మీలన్తి చ కన్దళ్యో దళన్తి కకుభాని చ.
వ్యాఖ్యానమందు 'వర్షావర్ణన మిదమ్' అని యున్నది.

రఘువంశము, ౧౩ (౨౯)
ఆసారసిక్తక్షితిబాష్పయోగా
న్మామక్షిణో యత్ర విభిన్నకోశైః,
విడమ్బ్యమానా నవకన్దళైస్తే
వివాహధూమారుణలోచనశ్రీః.

వ్యా. విభిన్నకోశైః = వికసితకుట్మలైః నవకం-
లైః కన్దళీప్రసూనై రరుణవర్ణైః 'ద్రోణః క్షీణస్నిగ్ధకన్దా కన్ద-
భూకదళ్యపీ'తి శబ్దార్ణవః.

దీని ఇంగ్లీషులో—

"by the new flowers of Kandali."

విక్రమోర్వశీయము, ౪ (౫) వర్షర్తువు

ఆరక్తరాజిభిరియం కుసుమైర్నవకన్దలీసలిలగర్భైః,
కోపాదన్తర్బాష్పే స్మారయతి మాం లోచనే తస్యాః.

దీనికి ఇంగ్లీషు టీక, ౧౧౪:—

"The form, viz. boat-like hollow shape of the covers of the plantain flowers enables them to retain the rainwater in them hours, sometimes days after a rainfall."

(ఇట్టి అనువాదంబులందు 'Plantain' అనుటం గూర్చి మదీయవ్యాఖ్య ఈగ్రంథమందే రానగలదు.)

మేఘసందేశము.

నీపం దృష్ట్వా హరితకపిశం కేసరైరర్ధరూఢై
రావిర్భూతప్రథమముకులాః కన్దలీశ్చానుకచ్ఛమ్,
దగ్ధారణ్యేష్వధికసురభిం గన్ధమాఘ్రాయ చోర్వ్యాః
సారఙ్గాస్తే జలలవముచః సూచయిష్యన్తి మార్గమ్.

దీని యాంగ్లానువాదంబున

"After eating on every bank the plantain tree on which first buds have appeared..."

దీని యాంగ్లటీకలో పే. ౨౫.

"The blossoming of the Kadambas and the budding of Kandalis accompany the advent of the rainy season."

వ్యా. కన్దలీః భూమికదలీః "ద్రోణపర్ణీ స్నిగ్ధకన్దా కన్దలీ భూకదల్యపి" ఇతి శబ్దార్ణవే.

కర్తుం యచ్చ ప్రభవతి మహీముచ్ఛిలీన్ధ్రామవన్ధ్యాం
తచ్ఛ్రుత్వా తే శ్రవణసుభగం గర్జితం మానసోత్కాః,
ఆకైలాసాద్బిసకిసలయచ్ఛేదపాథేయవన్తః
సంపత్స్యన్తే నభసి భవతో రాజహంసాః సహాయాః.

వ్యా. ఉచ్ఛిలీన్ధ్రామ్ = ఉద్భూతకన్దలీకామ్. "కన్దల్యాంచ శిలీన్ధ్రీస్యాత్" ఇతి శబ్దార్ణవే. శిలీన్ధ్రాణాం భావిసస్యసంపత్తిసూచకత్వాదితి భావః.

తదుక్తం నిమిత్తనిదానే—

"కాలాభ్రయోగాదుదితాశ్శిలీన్ధ్రా
స్సంపన్నసస్యాం కథయన్తి ధాత్రీమ్."

అనువాదంబున

"able to make the earth full of mushrooms shooting (from it)"

సుభాషితరత్నభాండాగారము, పే. ౫౫౭:

గోకర్ణాంగుష్ఠమానాః పృథుతరపృథుత
గ్రాహిణః కమ్బరోమాః
ఆకర్షన్తో దిగన్తానపి చ విదధతః
కన్దలీసుప్రచారాః,
ఏతే ధావన్తి వార్ధ్రేరివ మురుదను
ధారయన్తస్సమస్తా
దావ్యాన్నిష్ఠోఽభివిధిం వనమిన కబర
శ్రీన్నిభాతోఽమ్బువాహాః.

మల్లికామారుతము, ౯ (౧౫) పే. ౩౬౬.

అమీ కేళిపికీవాసరాః ప్రసవతేమదం కేకినాం
విజృమ్భితనవకన్దలీః శిలీన్ధ్రప్రవృద్ధయః,
పయోదవలిభిః ద్గగః దర్శనప్రోన్నతే
కృషీవలవిలాసినీనయనకాన్తితాశ్శిబితాః.

ఇందుకు కలకత్తా ప్రతులలోని వ్యాఖ్య:

వ్యా. నవకన్దలీనాం పుష్పాణి నవకన్దళ్యః 'ప్రవృష్యమాణేషు బహులకమిలితుప్ విజృమ్భితోల్లయా నవకన్దళ్యః' వర్షలక్షణతయా భావిసస్యసంపత్తిసూచకాని, నూతనశిలీన్ధ్రకుసుమాని; ఉక్తంచ "కాలాబ్దయోగాదుదితాశ్శిలీన్ధ్రాః, సంపన్నసస్యాం కథయన్తి ధాత్రీమ్" ఇతి.

దీనికే ధర్మాధికారి చక్రవర్తి అయ్యంగారు ముద్రించిన తిరుమలతాతాచార్య వ్యాఖ్య:—

అమీ ఇతి. విజృమ్భిణీనాం వర్ధమానానాం నవకందలీనాం నూతనశిలీంధ్రకుసుమానాం దేశేషు ప్రదేశేషు

నిలీనాః సౌరభాఘ్రాణార్థం లగ్నాః పుష్పంధయా భ్రమరా యేషు తే... [ఇట నీవ్యాఖ్య ధర్మాధికారిగారి ముద్రణమునందు వీఃర్ణక్రమ మున్నదో అవర్ణక్రమముననే ముద్రింపఁబడినది]

మాలతీమాధవము, ౯ (౧౬) పే. ౨౩౦.

జృమ్భాజర్జరడిమ్బడమ్బరఘన శ్రీమత్కదమ్బద్రుమాః
శైలాభోగభువో భవన్తి కకుభః కాదమ్బినీశ్యామలాః,
ఉద్యత్కన్దలకాన్తకేతకభృతః కచ్ఛాస్స్రోతస్వినీనా
మావిర్భూతశిలీన్ధ్రిణో ద్రకుసుమస్తే రావణానాం తతిః.

త్రిపురారి వ్యాఖ్య — శిలీన్ధ్రాః పున్నాగవిశేషాః, రమ్భేత్యన్యే. శిలీన్ధ్రాః కన్దళీపుష్పే కరకత్రిపుటాక్ష్వయో రితి విశ్వః. త్రిపుటకేతి విచికిలాది శేషః.

చకోరవర్మ మున్మదితం కరోతి.

జగద్ధర వ్యాఖ్య — శిలీన్ధ్రం కన్దళీపుష్ప మితి విశ్వః. శిలీన్ధ్రం 'పూల' ఇతి ఖ్యాతమ్.

దేశికాచార్యులవారి యాదవాభ్యుదయము:—

అమ్బ్వావ్యమానో విహితాం స్వభాజా
మజ్ఞాం సహస్రేణ తదా మహేన్ద్రః,
అశేషసం రక్తశిలీంధ్రజాలై
రాకాలికై రంచిత మన్వకార్షీత్.

అందులకు అప్పయ్యదీక్షితకృతము-వ్యాఖ్యానము:—

"రక్తశిలీంధ్రజాలైః అరుణకదళీపుష్పనివహైః, కరజైః ॥ ని ॥ కదళ్యాం చ శిలీంధ్రస్స్యా దితి శబ్దార్ణవే. అంచితం పూజితం, మనోహర మిత్యర్థః — అశేషసంకాలం వర్షాసమయం, తత్రైవ శిలీంధ్రాణాం విజృంభణాత్. అన్వకార్షీత్ = అనుకృతవాన్. తుణీరై రరుణ కదళీపుష్పైః స్సర్వతో వ్యాప్తో వర్షాసమయ ఇవ స్థిత ఇత్యర్థః."

విక్రమార్కచరిత్రము, పే. ౪౯ (౩౫)

లలితగతి న్మయూరికలు లాస్యమొనర్పఁగ భేకసుందరీ
కలకలగానము ల్వెలుఁగ గర్జనవాద్యము లుల్లసిల్లఁ గం
దళకుసుమాంజలుల్వెలయ నర్తనశాల యనం దనర్చె

భూతలము విచిత్రవారిద వితానతిరస్కరిణీసమేతమై.

ఋతుసంహారము, ౨ (౫) పే. ౧౯.

ప్రభిన్నవైడూర్యనిభై స్తృణాఙ్కురైః
సమంచితా ప్రోత్థితకన్దలీదళైః,
విభాతి శుక్లేతరరత్నభూషితా
వరాఙ్గనేవ క్షితి రిన్ద్రగోపకైః.

వ్యా. ప్రోత్థితాని నిర్గతాని యాని కన్దళీనాం దళాని పత్రాణి తైః "ద్రోణపర్ణీ స్నిగ్ధకన్దా కన్దళీ" ఇతి శబ్దార్ణవః.

ఆంధ్రమాఘము, పే. ౪౭ (౩౧)

గీ. విరళకందళకంపనావిష్కృతుండు
కామినీమానహరణుండు ఘనపవనుఁడు
క్షితిని వనములఁ గంపింపఁజేసె ననఁగఁ
దెలఁగి విరహులఁ గంపింపఁజేయు టరుదె.

ఆంధ్రమాఘము (౩౩)

చ. అతులకదంబపుష్పకర
జోరుణితాంబరము ల్తుషారసం
గతములు కందళీకుసుమ
గంధయుతంబులునైన వాయువుల్
చతురత నూత్ననూత్నముగఁ
జంచలనేత్రలమీఁద సారెకుం
జిరగతి రాగము న్గలుగఁ
జేసెను గాముకమానసంబులన్.

ఆంధ్రమాఘము, పే. ౭౫ (౬౨)

చ. ఘనభవవారిలాభ మది
గల్గుచునుండ మయూరము లున్మదం
బున నటియించె కేకులు
సముద్ధతిఁ బాడె మదంద్రిణిదంపతుల్
కనవడి సాంధ్యదీపరుచి
పాటలభూరిసుగంధబంధుర
ప్రణుత శిలీంధ్రపుష్పముల
రక్తిమెయిం జరియించె నర్తకిన్.

కందళి యను నీమొలకయే కేవల వార్షికము.

"కుసుమైర్గ్నవకదళీ"—విక్రమోర్వశీ.

కదళియుఁ దత్కుసుమంబును సార్వకాలికంబులు.

వసంతమునం గదళీకుసుమము.

బాలభారతము, పే. ౭౦ (౩౩)

మత్తేషు పశ్య దయితా రసవిహ్వలేషు
పారావతేషు కృతకౌతుకకూజితేషు,
ఏషా వసన్త పరిరంభభరేణ రమ్భా
కామాతురేవ మకరన్దరసం దదాతి.

విక్రమాంకదేవచరిత్రము, పే. ౬౩ (౮౧)

పానీయం నారికేళీ ఫలరసహరసహా
త్కారికల్లోలయన్తః
కావేరీతీరతాళద్రుమమథితమురా
భాణ్డభాజ్కారచణ్డాః,
ఉన్మీలన్నీలమోచాపరిచయశిశిరా
వాన్త్యమీ ద్రావిడీనాం
కర్పూరాపాణ్డుగణ్డస్థలలులితతరా
వాయవో దాక్షిణాత్యాః.

దక్షిణమారుతముచే వసంతము సూచితము.

మనుచరిత్ర, [వసంతర్తువు.]

చ. అపరిమితానురాగసుమనోలసరై చిగురాకుఁజేతులం
దపసిని గౌఁగిలించె వనితా, యిదె రంభ దలంప రంభదా
నపరిమితానురాగసుమనోలసదై చిగురాకుఁజేతులం
దపసినిగౌఁగిలించుటుచితంబె కదా యన నవ్వ రంభ
[యుంజా.

వసంతములో వనటి విజృంభణము.

మాఘము, ౪ (౬౯)

జగద్వశీకర్తు మిమాః స్మరస్య
ప్రభావనీకేతన వైజయన్తీః,
ఇత్యస్య తేనే కదళీర్మధుశ్రీః
ప్రభావనీకేతన వైజయన్తీః.

వ్యా. కదళీః=రమ్భాతరూః. కదళీషు కామ
వైజయన్తీత్వోత్ప్రేక్షా.

ఆఁదులకు ఆంధ్రీకరణము, పే. ౭౩ (౬౦)

సీ. అతులప్రభావనియగు వసంతేందిర
సకలజగజ్జయ చతురయిదవ
వీరసైన్యమునందు విరహజిత్వర కేతు
వైజయంతులు గూర్పవలయు ననుచు
విసువెక కదళులు విస్తరింపఁగఁజేసె
......................

నేమినిర్వాణకావ్యము, పే. ౪౧ (౨౦)

రమ్భారామా కురవకకమలా
రమ్భారామా కురవకకమలా
రమ్భారామా కురవకకమలా
రమ్భారామా కురవకకమలా

నేమినిర్వాణకావ్యము, (౫౧)

వృక్షైర్వసన్తతిలకాయితపుష్పభారైః......

వ్యా. రమ్భాభిః కదళీభిర్మిశ్రా ఆరామాయస్యాంసా.

ప్రసన్నరాఘవనాటకము. ౫

లక్ష్మణః—

ఆర్య, నిసర్గరమణీయో ఽయమారామః,
అధునాతు మధుమాసావతారేణ కాన్తతరమణీయః.

రామః—

శ్యామస్ఫటీనామియమన్తరాళే
ప్రాదుర్భవన్తీ కదళీదళానామ్,
కళేబరాద్ద్రిపవనీరదానాం
చకోరవన్మాం ముదితం కరోతి

* * * *

హే బాల హే మకదళి ధ్రువ మిహానేకే
మారుద్రీతుం కలయితుం తరలాయతాక్ష్యాః;
ఏవాం విలస్యయ విలాసవతీం చిరంహి
స్త్రీణాం కళాః పరిచితాః స్థిరతాం ప్రయాన్తి.

ఉదారరాఘవము, పే. ౧౨౭ (౪౭)

కదళీకళీకోకిలాభిః
కృతకోలాహలకాహళప్రపఞ్చః,
మలయానిలమత్తవారణస్థో
మదన స్త్రత్రపదికారథైర్జయాత్రామ్.

వసంతములో అరఁటిపండ్లు పండుట.

కువలయాశ్వవిలాసము, పే. ౨౨ (3, ౪ పంక్తులు)

దక్షిణానిలాన్దోలాసహ్యాశ్వ గన్ధరతాధికతదిగన్ధాగ భావపంజనితలజ్జయేవ పరిణతఫలభార పరిణమితశిరోభి రభిశోభితం రమ్భాభిః.

మనుచరిత్ర (వసంతఋతువు)

ఏటవాలైనతుదియాయరఁటిబాలెంత
చేటునకు యను చూలుంచేఁ గల్గ మేలెంత.

వేసవిలో నరఁటిపెంపు.

శార్ఙ్గధరపద్ధతి, పే ౫౨౦ (౧౪) [వేసవివర్ణనము]
సర్వత్సారణివారిశీతలతలె విన్యస్తపుష్పోత్కర
నీరన్ధ్రే కదలీవనే గురుదళచ్ఛాయాహతార్కత్విషి,
కర్పూరాగురుపఙ్కపిచ్ఛిలఘనోత్తుఙ్గస్తనాలిఙ్గిభిః
కాన్తాకేళిరతై రహః సుకృతిభిర్మధ్యందినం నీయతే.

వేసవిలో నరఁటిపండ్లు పండుట.

విద్ధసాలభఞ్జిక, పే. ౮౨ (౨)
రజని చరమయామే ప్వాదిశే న్తీర తేచ్చాం
కిమపి కిమయ స్తీ నారికేళీఫలామ్భః,
అపిపరిణమయన్తీ రాజరమ్భాఫలానాం
దివపరిణతిభోగ్యా వర్తతే గ్రీష్మలక్ష్మీః.

ఆముక్తమాల్యద: వేసవిప్రస్తావమున:—
సీ. పరిపక్వసురభిరంభాఫలంబులతోడ......
.........తివరాతు రసనాడికజలతోడ.

అరఁటిపెంపు సార్వకాలికము.

నేమి నిర్వాణము, పే. ౪3 (౧౦)
రమ్భాభిరామం సరసం స్ఫురద్గుణకదంబకమ్,
యాదవీనాం కులంక్రీడానం తత్రవివేశతత్.

అరఁటిపువ్వు సార్వకాలికము

ఆముక్తమాల్యద:
చ. కదళిగభీరపుష్పపుటి
కాచ్ఛుట చేతుల నిప్పుకింపై
గుదురుగఁ జిల్పి యోపుగతిఁ
గూనల మూనియు నించి త్రాటము
న్నదికినకాటి త్రేల నది
నొక్కటఁ గ్రుంకిడినత్తు రెండతే
వదలక యూతనింట కని
వారమునం బరదేశివైష్ణవుల్.

అరఁటిపండు సార్వకాలికము.

ఆముక్తమాల్యద:
గీ. బోటిగట్టిన చెంగల్వపూవు పెట్టు
దరుపరిణతోరు కదళిమంజరియుఁ గొనుచుఁ
బోయి గుడినంబి విజయంబుఁజేయఁజొచ్చి
మ్రొక్కి వేదికఁ బలువన్ను మ్రుగ్గుపెట్టి.

గీ. కపిలగవిసర్పిఁ బృథుదీపకళికఁదీర్చి
ద్వయముతో పకుమునఁ గల్వదండసేర్చి
అగరుధూపంబు లిడి శర్కరాజ్యయుక్త
హృద్యకదళీఫలాళి నైవేద్య మిచ్చి.

క. ప్రతిదినము నిట్లునని య
చ్యుతుపూజ యొనర్చినచ్చి సుదతివియోగ
ద్యుతకైర్యయగుచు నయ్యదు
పతిగుణములఁ ద్రవిడభాషఁ బాడుచునుండున్.

సూర్యాలోకంబను నొక తెనుఁగు వార్తాపత్రిక యందు ఉపవిలేఖకులు మోచాకుసుమామోదవిచార వ్యాసంబున నొకదాన పూర్వోదాహృత యాదవాభ్యుదయ శ్లోకమును, దాని యా వ్యాఖ్యానమును ఇట నీ మదీయ గ్రంథంబున ముద్రించిన వర్ణక్రమ మర్యాదనే యుదాహరించి—ఈ వ్యాఖ్యలో దీక్షితులవారు తమ వాక్యమందును తా ముదాహరించిన శబ్దార్ణవవాక్యమందును "కన్దళీ" అని వ్రాయక "కదళీ" అనియే వ్రాసి నారనియు, ఆ కారణంబునం జేసి మాఘువ్యాఖ్యయందు మల్లినాథసూరి యుదాహరించిన శబ్దార్ణవ వాక్యమున "కన్దళ్యాంచ శిలీన్ధ్రస్స్యాత్తే"ను దాన "కన్దళ్యాను"నట పొరఁబాటనియు "కదళ్యాను"నవలసిన దనియు నభి ప్రాయము సూచించి— అందుల కుపబృంహకముగా శ్రీ రాజా రాధాకాంతదేవ బహద్దూరువారి యకారాది నిఘంటువునుండి— ఇట నిందు ముద్రితమైన వర్ణక్రమము తో—శిలీంధ్రం. క్లీం. కదళీపుష్పం, (యథామాఘే

౬-౩౨: "నవకదంబరజోఽరుణితాంబరై రధిపురంధ్రి శిలీంధ్రసుగంధిభిః")

అని ప్రమాణము నుదాహరించి—మాఘుకావ్యమందలి శిలీంధ్రము కదళీపుష్పంబుగా నెంచఁబడినట్లు కనంబడుచున్నదని నిరూపించినారు.

ఇటులెల్ల 'కన్దళీ' యనుటకు మాఱుగా 'కదళీ' అని అచ్చునం బొరఁబాటు పడినదనుట సిద్ధాంతమని వక్ష్యమాణగ్రంథమువలనం దెలియవలెను. అంతేవలను:—

(౧) ఈ వ్యాఖ్యయందు 'వర్షాసమయం తత్రైవ శిలీన్ధ్రాణాం విజృమ్భణాత్త'నుటచే శిలీంధ్రము కేవల వార్షికంబ యని రూఢికెక్కినది గదా.

(౨) సూరిదీక్షితులలో నొకరి వ్రాఁతంబట్టి యింకొకరి వ్రాఁతం దిద్ద దొరంకొనుట అమార్గంబు. ఈ యాదవాభ్యుదయ శ్లోకాదికములందు అచ్చుఁ బొరఁబాటులుం లేవని యాగ్రహమా? అటులేని దేశికులవారికి మహేన్ద్రశిలీన్ధ్రి అన్వితశబ్దాంబులందును, దీక్షితులవారికి అన్వితశిలీన్ధ్రః జృమ్భణ శబ్దములందును, మాఘకవికి కదమ్బప్రసూనాది శబ్దములందును పరసవర్ణానునాసికమే గాని అనుస్వారము గాదను నియమము తెలియుదనకలసి వచ్చును. కావున నీవిషయంబున సందేహముం దీర్ప ప్రమాణము అపేక్షణీయము. మల్లికామారుతమునుండి యీ గ్రంథమున నుదాహరింపఁబడియున్న 'యమిరాకిము'పీత్యాది సమస్యాత్తమున "ఎవకన్దళీ" యని మూలంబును, తద్వ్యాఖ్యయందు "నూతనశిలీన్ధ్రకుసుమాని" యని తదర్థంబును గలవు పైగా ఆ వ్యాఖ్యయందు "కాలాబ్దయోగాదుదితాః శిలీన్ధ్రాః సంపన్నసస్యాం కథయన్తి ధాత్రీమ్"అని నిమిత్తనిదానంబునందు ప్రమాణంబు ఉదాహరింపఁబడియున్నది. ఆ ప్రమాణమే మేఘవ్యాఖ్యలో "ఉచ్ఛిలీన్ధ్రామ్" అన్నచోట మల్లినాథసూరి వ్రాసియున్నాఁడు:—కావున అచట మల్లినాథసూరి యుదాహరించిన శబ్దార్ణవవాక్యమున "కన్దళ్యాం చ శిలీన్ధ్రః స్యాత్"అనుదాని "కన్దళీ" శబ్దము పొరఁబాటు గానియు, దానిని "కదళీ" శబ్దముగాఁ దిద్దవలసినపని లేదనియు, దీక్షితోదాహృత శబ్దార్ణవవాక్యమందే అచ్చు పొరఁబాటనియు దీనినే కన్దళీశబ్దముగాఁ దిద్దికొనం దగుననియు, ఈ మల్లికా తద్వ్యాఖ్యలవలనం దెల్లమగుచున్నది.—మఱియు దీక్షితులవారి వ్యాఖ్యతో యాదవాభ్యుదయమును అచ్చు వేయించినవారు మహీశూర సంస్థాన ధర్మాధికారి శ్రీమాన్ చక్రవర్తి అయ్యంగారువారు. వారే తిరుమల తాతాచార్యులవారి వ్యాఖ్యతో మల్లికను గూడ నచ్చు వేయించినవారు. ఆ వ్యాఖ్యయందును 'నవకన్దళీ' శబ్దమునకు 'నూతన శిలీంధ్రకుసుమార్థము వ్రాయఁబడియున్నది. యాదవాభ్యుదయటీకలో కదళీయని ముద్రించిన ధర్మాధికారిగారు మల్లికా తట్టీకలపై—మూలమందలి కన్దళీశబ్దమునంగల నకారము తప్పనియేని, వ్యాఖ్యయందలి శిలీంధ్రార్థము తప్పనియేనియు సూచింపరైరి. కావున యాదవాభ్యుదయ టీకలో వారు 'కన్దళీ' అని [నకారసంయుతముగా] ముద్రింపమి కనుదప్పుచేత నని తెల్లమగుచున్నది. ఈ చర్చచేతనే బహద్దూరువారి కదళీపుష్పంబు పొరఁబాటనియు, వారు "కన్దళీపుష్పమ్" అని ముద్రించికొని యుండిన సరిగా నుండుననియుం దెలియనగుచున్నది.

పూ. ద్విరూపకోశమందు:

వాసరావాసురీపస్యా న్మహిళా చ మహేళికా,
కదళీకన్దళీ చ స్యా ద్దరీ చాదరం తథా. ౧౦

అని "కదళీకన్దళీ" శబ్దములకు అభిన్నార్థత చెప్పఁబడినది. కావున నిట నియ్యురునాదములు-రును పడిన ప్రయాస వ్యర్థము, అని హెచ్చరించువారికి ఉత్తరము:

ఉ. ఈ కోశమందే ముద్రితప్రకారంబున 'కదళీ కన్దళీ' యను వాక్యము మఱియొక శ్లోకమందు మఱల ముద్రితమై యున్నది. మఱియును సమూరు చమూరు వులకు అభిన్నార్థత చెప్పఁబడినది.

తుపరస్తూపరో ఽపిస్యా త్తూపరః తూపలో ఽపిచ
ఉత్తమోత్తమో ఽపిస్యాత్ కదళీకన్దళీ తథా. ౧౩
పరిరమ్భః పరీరమ్భః క్రోడా క్రోడశ్చ కీర్తితః
గాణ్డీవో గాణ్డివం చాపి సమూరుశ్చ చమూరువత్. ౧౪

అమరమున:

కదలీ కన్దళీ చీన శ్చమూరు ప్రియకావపి;
సమూరుశ్చేతి హరిణా అమీ అజినయోనయః.

అని చమూరు చమూరువులకు భేదము చెప్పఁబడినది. కావున కేవలానువృత్తమునకు మాఱుగా లేఖకదోషంబున చమూరువ ర్తని వ్రాసియుండును. కేవలచే నయిన రూపభేదములు పయి కోశంబున "ముసలో ముసలోపిచ" ఇత్యాదిస్థలములయందు ఉపాత్తములై యున్నవి. అట్లే 'కదళీకన్దళీ' అనువాక్యమందు రెండు మాఱ్లుండుట పాఠమునం బ్రత్యక్షముం దోఁచు చున్నది. ఒకజత నృత్యార్థముం దభేదమును ఇంకొకజత మృగార్థముం దభేదమును తెల్పుటకు వినిగమన మేమి? ఏజత దేనిం దెల్పునో! అందులకు వినిగమనంబేమి? జతను ఒకమాఱే చెప్పినచో నానార్థములందు అభేదము సిద్ధింపదా? "గన్ధర్వోఽపిచ గాన్ధర్వః" అన్నచో నానార్థములం దభేదము సిద్ధింపలేదా? ఇందు తొలిజతకు "కదళం కన్దళీ"*

"రమ్భాయాం వైజయన్త్యాంచ" అను నానార్థరత్నమాలా వాక్యముంబట్టి కదళియనఁగా రంభ యను నప్సర యని చెప్ప నొప్పునా? "మోచాశాల్మలి రమ్భయోః" అను మేదినీవాక్యముంబట్టి మోచకు రంభయను నప్సరసు అర్థముగా చెప్పం జెల్లునా?

కప్పురపుటనఁటి పూవు కారణము.

బాలభారతము, పే. ౨౦౩ (౭౩)

యద్వనీషుచల ఖఞ్జననేత్రా
సర్వతః కదళీ విలలాస,
తద్భ్రమార భువి తత్పదరేఖా
విభ్రమం స్థలరుహోత్పలపఙ్క్తిః.

బాలభారతము, (౭౬)

మత్పదోముహు రయుక్ష్ణపమ్పం
నేవ తేష్ము గజదాన సుగన్ధి,
తజ్జ్యోత్స్నాశ్రవణ తాళనిపాతః
సిద్ధశాద పిపిలా దతి ఖిన్నాత్.

ఆముక్తమాల్యద, ౪ (౧౪౩)

క. రవిశశిముకురములం కర
ద్యుతి మెఱుఁగుపెట్టు భూతియోయనఁ బర్వెన్
బవనాహత సప్తచ్ఛద
నిజమాపరాగంబుదివికి నిర్మలకాంతిన్.

శార్ఙ్గధరపద్ధతి, పే. ౫౯౪ (౯)

చేతః కర్షన్తి సప్తచ్ఛదకుసుమరజఃపాపారసౌరభ్యభాజః
దృష్టిం జిఘ్నన్తి శృఙ్గత్రుటిభుగ్భగదిక్ సీవాసరాత్యారదినాః.

ధర్మశర్మాభ్యుదయము, పే. ౭౧ (౫౧)

ఆయామసఙ్గజనస్య ముదామ్బునః
పరిమళోవతు శారద భూరుహాః,
ఇదమయత్రిపదీత్రుటిశాఖినః
కమలినీమలినీ వికృతి ర్న్నతు.

రఘువంశము, శరద్వర్ణనము. ౪ (౨౩)

ప్రసవైః సప్తపర్ణానాం మదగన్ధిభి రాహతాః,
అసూయయేవ తన్నాగాః సప్తధైవ ప్రసుస్రువుః.

విక్రమార్క-చరిత్రము, పే. ౭౯ (౩౬)

ఉ. హారిమయూరవిభ్రమము
లంపలఁ జెందెఁ దటిద్విలాసముల్
తారలఁ జేరెఁ బప్పిత్తిక
దంబవిజృంభణ సప్తపర్ణనా
నారుచిరప్రసూన భజ
నంజొరించె శీతమాగముం
బారము నంబుదాగమము
హారిమోన్నతి నాక్రమించినన్.

మాఘము: శరద్వర్ణన, ౬. (౫౦)

నవు ర సూక్ష్మగన్ధిసుగన్ధయః... ......

ఈ కప్పురపుఁబ్రాఁకు అనఁటియనం బ్రమాణము:-

మనుచరిత్ర:

అరిది యీరేడుదాకు లరఁటి నగు కప్పురము
పరగాదు దానికల కెత్తుడలం క...

* ఇచట మూలమున కొంచెము లోపించినది.

ఆముక్తమాల్యద, ౫ (౧౮౩)

శశికదళోదరస్థానపుఁ బావడలూరు
చకపాఁకట్టె పాలికిఁజెంగ.

వ్యా. శశికదళ=కర్పూరపు టరఁటిచెట్టుయొక్క.

నవకందళీకుసుమము (శిలీంధ్రము) పాటలము

"శిలీన్ధ్రైస్సహసా ముత్తానదీపపాటలాభైః"

"నవకన్దళీశిఖాపరుషం వహసి విషమారుణమధరం"

"అరుణత్వం ధారయద్భి రభితో౽పి శిలీన్ధ్రైః."

"విడమ్బ్యమానా నవకన్దళైస్తే వివాహధూమారుణ [లోచనశ్రీః"

"ఆరక్తరాజిభి రియంకుసుమై ర్నవకన్దళీ"

"అవ్యక్తరాగ స్త్వరుణః శ్వేతరక్త స్తుపాటలః"
—అమరము.

కర్పూరపు టరఁటిపువ్వు తెలుపు.

సుభాషితరత్నభాండాగారము, పే. ౫౬౦ (౧౧)

కాకాః క్షీరనికాశాః దధిసరవర్ణాని సప్తపర్ణాని,
నవనీతనిభైశ్చన్ద్రైః శరదిజతక్రప్రభా జ్యోత్స్నా. ౨

బృహత్సంహిత, ౨౯ పే. ౧౫౫.

ఫలకుసుమసమ్ప్రవృద్ధిం వనస్పతీనాం విలోక్య విజ్ఞే [యమ్,
సులభత్వం ద్రవ్యాణాం నిష్పత్తిశ్చాపి సస్యానామ్. ౧
గోధూమాశ్చ సుధూమై ర్యవవృద్ధిస్సప్తపర్ణేన. ౪
గావశ్చ పాటలాభిః కదళీభి రజావికం భవతి. ౭

బృహత్సంహిత, ౫౧ పే. ౧౬౪.

పనసాశోకకదళీ జమ్బూలకుచదాడిమాః,
ద్రాక్షాపాలేవతాశ్చైవ బీజపూరాతిముక్తకాః. ౪
ఏతే ద్రుమాః కాణ్డరోప్యా గోమయేన ప్రలేపితాః,
మూలచ్ఛేదే౽థవా స్కన్ధే రోపణీయాః ప్రయత్నతః. ౫
అజాతశాఖాన్ శిశిరే జాతశాఖాన్ హిమాగమే
వర్షాగమే చ సుస్కన్ధాన్ యథాదిక్ప్రతిరోపయేత్. ౬

బృహత్సంహిత, ౫౧. పే. ౧౬౫.

జమ్బూవేతసవానీర కదమ్బోదుమ్బరార్జునాః
బీజపూరకమృద్వీకా లకుచాశ్చ సదాడిమాః. ౧౦
వఞ్జులో వక్తమాలశ్చ తిలకః పనసస్తథా
తిమిరో౽మ్రాతకశ్చైవ షోడశానూపజాః స్మృతాః. ౧౧

శ్రీమదమరచంద్ర విరచిత కావ్యకల్పలతా ప్రథమ ప్రతాన వర్ణస్థితి స్తబకమం దిట్లున్నది.

సురభౌ దోలా కోకిలమారుత
సూర్యగతి తరుదళోద్భేదాః,
జాతీతరపుష్పచయా
మ్రమఞ్జరీభ్రమరఝంకారాః.

* * * *

వర్షాసుఘనశిఖిస్మయ
హంసగమాః పఙ్కకన్దళోద్భేదాః,
జాతీకదమ్బకేతక
ఝంఝానిలనిమ్నగాహలిప్రీతిః.
శరదీన్దుకవిపటుత్వం
జలాచ్ఛతా౽గస్తిహంసవృషదర్పాః,
సప్తచ్ఛదపద్మసితా
భ్రధాన్యశిఖిపక్షమదపాతాః.

శిలీంధ్రకదళీకుసుమములు—భిన్నపదార్థములు.

ఉదాహృతవర్ణనల ప్రకరణములచేతను, నవకన్దళీ ఉత్కన్దళ కన్దళోద్భేదనవకన్దళైః, ఆవిర్భూతప్రథమ ముకుళాః కన్దళ్యః ఉచ్ఛిలీన్ధ్రామ్ ఆవిర్భూతశిలీన్ధ్రౌ "అతిహాసం రక్తశిలీన్ధ్రజాలై రఞ్చితమ్," ఏవమాదిగత విశేషణసామర్థ్యంబుచేతను కందళీకుసుమము (శిలీంధ్రము) కేవల వార్షికంబనియు, 'కుసుమైర్నవకన్దళీ' అనుట చేత కందళీయను నీయెలరఁటియే కేవల వార్షికమనియును విశదమగుచుండ — ఉదాహృతకదళీవర్ణనలచే కదళియు తత్ఫలకుసుమంబులును సార్వకాలికంబు లనియును విశదంబగుచుండ, శిలీంధ్రంబును అరఁటిపూవును అభిన్నము లగుట యెట్లు ఘటిల్లును?

"శిలీంధ్రైరత్నభూషణాంగనైరిభూమిర్యాసితా"
అని యున్నది. అరఁటిపువ్వు ఆకులజీబులో స్పష్టముగా అగపడదు. కాన భూభూషణముగా నుత్ప్రేక్షకు దీనికి శోభావహము గాదు. కాన శిలీంధ్ర మనునది జీబున

మఱుఁగుపడక జాలికే స్ఫుటముగా నిగిడియుండు పువ్వు విశేషము గాఁగలయును.

"ఆకర్ణ శ్రీమూలధ్వనిం వసుమతీ దత్తే శిలీన్ధ్రధ్వజాన్."

అరఁటిపువ్వు ఆకులచాటున మఱుఁగి అగపడకుండును గాన దానికి ధ్వజత్వము చెప్పుట సరిపడదు. కాన శిలీంధ్ర మిట నరఁటిపూవు గాదు. మఱి యరఁటి చెట్టె యందమేని ఉఱుము బడబడయన్న మాత్రాన నరఁటి మొలచి నిగుడుట యనుభవరక్షితము గాదు. ధ్వజత్వకథనముచే మొలకయే పూవుతోడిది యభిప్రేతమని తలంపఁదగియున్నది. మేఘధ్వానముచే నా మొలక పొడమి నిగుడునని

"మహీ ముచ్ఛిలీన్ధ్రాం కర్తుం ప్రభవతి తే గర్జితమ్"

అనుటచే తెలియుచున్నది.

"ఆశీహాసంరక్తశిలీన్ధ్రజాలై రకాలికైః (క్షణికైః)
[అశ్విఃతమ్"

"నీపం దృష్ట్వా ఆవిర్భూతప్రథమముకుళాః
కన్దళీ ర్జగ్ధ్వా సారఙ్గాస్తేమార్గం సూచయిష్యన్తి"

అనుటచేత, అనఁగా "సారంగములు నీపకుసుమమును గొఱకి పొటమరించిన తొలిమొగ్గతోడి కందళికలను మెసవి నీదారిని సూచించును" అనుటచేత ఈ మొగ్గ యించుకతడవు పడున్న మేఘము మఱుపోయిన వెంటనే జనించినదని తెలియనగుచున్నది. మేఘసంపర్కముచేత కొన్ని మ్రాఁకులు పూచుట ప్రసిద్ధమే గదా. నీపవృక్షంబు అట్టిదియకదా, ఇఁక నీపకుసుమంబును ఈ మొగ్గయునే గదా మేఘము ఇప్పుడే యీదారిని పోయినదని సూచించినట్టివి. అకాలికైః (క్షణికైః)

మాలతీమాధవము :

ప్రథమప్రియవనవన సంక్రీడస్ఫుర
త్పులకేన సంప్రతి మయా విశుష్యతే,
ఘనరాజినూతనపయస్సము క్షణ
క్షణబద్ధకుట్మలకదమ్బకమ్బకః.

ఇందలి నూతన క్షణశబ్దముల స్వారస్యము నరయుఁడు.

నైషధము :

అర్థియను పేరు చెవిసోకినంతమాత్ర
జాదుకోఁ బులకించె వజ్జవిభుండు
ప్రావృషేణ్యపయోధర ప్రభవమైన
గాలి సనిచిన నీపవృక్షంబుఁబోలె.

ఇందు సోకినంతమాత్ర నను పదముల స్వారస్యము నరయుఁడు.

కుమారసంభవము :

తయాదుహిత్రా సుతరాం సవిత్రీ
స్ఫురత్ప్రభామణ్డలయా చకాశే,
విదూరభూమి ర్నవమేఘశబ్దా
దుద్భిన్నయా రత్నశలాకయేవ.

క్రొత్తయుఱుముచేకు రత్నశలాకలే పుట్టుచుండ, మొలకలు పొడముటయు ననుచుటయు వింతగాదు. కాన నిట మేఘోదయమువలన మొలచునది యు, ననుచునదియు నను నొకానొక మొలక శిలీంధ్రము గాని, అట్టి ధర్మంబుం బొరయని దగుటచే కదళి శిలీంధ్రము గాదు.

"అమోకిమపి" శ్లోకమందు కందళీకుసుమవికాసము వృష్టికిముందే మేఘోదయమాత్రమునకే వర్ణింపఁబడినది గదా.

మాఘుఁడు :

"శిలీన్ధ్రముకగన్ధిభిః" అని శిలీంధ్రమునకు సుగంధము చెప్పుటచేతను, ఇచ్చోటి మాఘవ్యాఖ్యానమునను "ఉచ్ఛిలీన్ధ్రామ్" అనుచో మేఘవ్యాఖ్యయందును వ్యాఖ్యాత పదవాక్యప్రమాణపారావారపారీణ మహామహోపాధ్యాయ శ్రీ మల్లినాథసూరి ఒకచో నిచ్చిన పర్యాయపదమునే రెండవచోఁటను, ఒకచో నిచ్చిన నిఘంటువాక్యమునే రెండవచోటను ఒసంగియుండుటం బట్టియు, పుట్టగొడుగునకు నీచకంపే గాని పరిమళము లేమింజేసియు, మేఘమందు శిలీంధ్రమునకు కొందఱు ఒజ్జలు సెప్పు పుట్టగొడుగు వివరణము సరిగాదు. మేఘ శిలీంధ్రవ్యాఖ్యయందు కుసుమమని నిర్దేశింపనందునను, మాఘశిలీంధ్రవ్యాఖ్యయందు నిర్దేశించినందునను, మేఘ

మున మొలకెత్తుటయు, మాఘమున దానిపువ్వును ఉద్దేశింపఁబడినవని యింతమాత్రమే సమాధానింపఁగలయును.

మాఘమందు శిలీంధ్రమునకు సుగంధము మాత్రమే గాక అత్యంతమదనోద్దీపకత్వము సూచితమైనది. ఉన్న ప్రకంపనశ్లోకమందు కందళీమొక్క మదనోద్దీపనమునకు లోఁగనివాఁడు లోకమ్మున లేని యెద్దరి చెప్పఁబడియున్నది. అరఁటిపూవున కింత మదనప్రభావము అదృష్టాంతరము.

కదళీధ్వజములను వసంతమునకును, శిలీంధ్రధ్వజములను వర్షర్తువునకును జెప్పుటచే నివి వేర్వేఱని తెలియుచున్నది.

"వనాంతభూమి", "అరణ్యేషు", "వనాన్తరేషు", "నీలకదంబం", "గిరియతిమ్", "వనయతిష్మవాని", ఇత్యాది వనప్రదేశవాచకపదనిర్దేశంబుచేతను, విక్రమోర్వశీయందలి కందళీప్రస్తావంబును, రఘువంశంబునందలి నవకందళీప్రస్తావంబును వనవృత్తాంతంబుల యగుట చేతను, ఉపవనవర్ణనలలో కందళి లేమిచేతను కందళి కెదటను ఫలములు చెప్పమిచేతను,—ఇది యేదో అరఁటి వలెఁగాక తోఁటపెట్టనర్హముగాని యొకవానకారు కాటిమొలక గానోపు.

నిమిత్తనిదానంబున కందళీసమృద్ధికి సస్యసంపత్తిసూచనయు; బృహత్సంహితయందు కదళీసమృద్ధికి అజావికసమృద్ధిసూచనయును భేదంబుంబట్టి యీ రెండును ఒక్కటియె గావని తలంపఁదగియున్నది.

కందళిని "కన్దళీశ్యామకచ్ఛమ్", "ఉద్యత్కందళకాన్తకేతకభృతః కచ్ఛాన్తరిత్సొప్రీతిసామ్"

అని కాళిదాసభవభూతులు అనూపజముగా తెల్పినారు. వరాహమిహిరాచార్యుఁడు కదళిని ప్రసక్తియున్నప్పటికిని అనూపజములలో చేర్పలేదు.

"జలప్రాయమనూపంస్యాత్పుంసి కచ్ఛస్తథావిధః"

దీనను ఇవి వేర్వేఱని విశదము. —అమరము.

వరాహమిహిరుఁడు అనూపజములలో కందళిని చేర్పమి యేలయన—ఆరామప్రతిష్ఠా వాతరువులే అటు ప్రకృతమైనవి. తదవస్థానమగుటచే నందు కందళి చేరలేదు.

శిలీంధ్రపర్యాయమునకును గందళికి "స్నిగ్ధకంద" యని యొకపర్యాయ మున్నదిగదా. అరఁటిదుంపలో జిగురులేదు. అంటుకొనుగుణము లేదు. కందళీకందమున నది యుండవలయు.

"ద్రోణపర్ణి" యని కందళీపర్యాయ మొకటి యున్నదిగదా. అరఁటియాకులు దొప్పలవలె నుండవు. అరఁటిపూరేకు లట్లుండును. ఇదియు భేదమునకు నిదర్శనము.

అమరవ్యాఖ్యాత రామాశ్రమి విద్వదగ్రణి అమరకోశమందలి సకలపదములకును గల నానార్థములనెల్ల తత్తన్నిఘంటుప్రమాణోపన్యాసపూర్వకంబుగా వివరించినవాఁడు. కందళీశబ్దము నర్థములలో గుల్మప్రభేదార్థమును వ్రాసినాఁడేగాని కదళ్యర్థమును వ్రాయఁడాయెను. ఆ భేదమును తెల్పఁడాయెను.

శ్లోకరూపము లగు ప్రాచీననిఘంటువులలో నెందును కందళికి కదళ్యర్థములు గాని, కదళికి కందళ్యర్థములుగాని, కందళీ కదళీ శబ్దములకుం బర్యాయశబ్దత్వము గాని, కదళీవాచకములలో కందళీశబ్దముగాని, దీని ద్రోణపర్ణ్యాదిపర్యాయములు దాని పర్యాయములలోఁ గాని, దాని రంభామోచాదిపర్యాయములు దీని పర్యాయములలోఁ గానియుం గానరావు. మఱి కదళికిని కందళికిని ఒకదానియర్థములు మఱియొకదానికిఁ గాకుండ వేఱువేఱు అర్థములే చెప్పఁబడి యున్నవి.

నానార్థరత్నమాల:

కన్దళీమృగభేదేస్యాత్......

కదళీ ద్రుగే రమ్భాయాం పైజయా స్తమ్భే.

అమరము:

కదళీవారణబుసా రమ్భామోచాంశుమత్ఫలా

కాష్ఠిలా......

మేదినీ:

కదళా కదళౌ పృశ్న్యాం కదలీ కదలౌ ధ్వజః
రమ్భావృక్షేఽథ కదలీ పతాకా మృగభేదయోః,
కదలా శిమ్బికాయాంచ శాల్మలీభూరుహేఽపిచ.
మోచః శోభాఞ్జనే పుంసి మోచాశాల్మలిరమ్భయోః,
కన్దళం త్రిషు కపాలే ఽప్యుపరాగే నవాఙ్కురే,
కలధ్వనౌ కన్దలీ తు మృగగుల్మప్రభేదయోః.
శిలీన్ధ్రిం కన్దలీపుష్పే కబరే నాఘుహస్తరే,
ద్రుమభేదే స్త్రీస్తు విహగీ భేకగణ్డూపదీమృకోః.

మల్లినాథధృత శబ్దార్ణవ వాక్యము:

ద్రోణపర్ణీ స్నిగ్ధకన్దా కన్దలీభూకదళ్యపి,
కన్దళ్యాం చ శిలీన్ధ్రింస్యాత్.

త్రిపురారిధృత విశ్వకోశవాక్యము:

శిలీన్ధ్రిం కన్దలీపుష్పే కర త్రిపుటకాఖ్యయోః.

జీవానందముద్రితమైన శ్రీమదాచార్య హేమచంద్ర విరచితానేకార్థసంగ్రహమం దిట్లున్నది

..............శిశిరః శీతలే హిమే,
ఋతుభేదే శిలీన్ధ్రిస్తు తరుమీన ప్రభేదయోః,
శిలీన్ధ్రిం కదళపుష్పే కవక త్రిపుటాఖ్యయోః,
శిలిన్ధ్రీ విహగీగణ్డూపదీమృ దథ శీకరః,
కపాలం కుష్ఠరుగ్భేదే ఘటాదిశకలే గణే,
శిరోఽస్థని కన్దళంతు నవాఙ్కురే కలధ్వనౌ,
ఉపరాగే మృగభేదే కలాపే కదలీ ద్రుమే.

ఇందలి యధోరేఖాంకితపదములుమాత్రము నాగర పుస్తకమున పెద్దయక్షరముల నున్నవి.

ఆ పెద్దయక్కరముల పదములెల్ల వర్ణక్రమము ననుసరించి వచ్చుచున్నవి: శిశిర, శిలీన్ధ్రి, శిలిన్ధ్రీ, శీకర...కపాల, కన్దళ, కదలీ. పెద్దయక్కరముల పదములు మూలపదములుగాను కడమవి వాని నానార్థ వాచకములుగాను ఈ గ్రంథమునందలి పరిపాటి. దానం జేసి యిట 'కదలీ ద్రుమే' యనుట కన్దళార్థము కాదని యు, సమాసము గాదనియూ, కదలీశబ్దమునకు ద్రుమవిశేషము [అనఁగా అరఁటి] యర్థ మను నర్థముగా నిది యొకవాక్యమనియు, ఇందు కదలీశబ్దము ప్రథమాంతము మూలము గాను, ద్రుమే యనిసప్తమ్యంతము వివరణము గాను గ్రంథకర్త యభిప్రాయ మనియు తేర్పడు చున్నది.

ఇట 'ద్రుమవిశేషే' అనక 'ద్రుమే' యనుట అరఁటి యను వ్యాఖ్యను బాధక మనఁదగదు నిఘంటుకారులు 'విశేష' పదమును మానుటయుం గలదు; కనుఁడు

నానార్థరత్నమాల:

"కదలీమృగే 'రమ్భాయాం వైజయన్త్యాం చ,'"

ఇట 'మృగవిశేషే' అనలేదుగదా.

కొన్ని వ్రాఁతపుస్తకములలో శిలీంధ్రమని దీర్ఘ మధ్యముగా నున్నదని ముద్రకుల జ్ఞాపిక.

వాచస్పత్యము — బృహదభిధానము.

కన్దళ — త్రి. కది అలచ్, ౧ కలాపే, ౨. ఉపరాగే, ౩. నవాఙ్కురే, ౪. కలధ్వనౌ చ మేది, ౫. అపవాదే-శబ్దర, ౬. కలహభేదే (వాగ్యుద్ధే), ౭. కపాలే చ- పు. ధరణిః-గౌరా-దీష్ కన్దళీ ౮. మృగభేదే చ 'స్త్రీ' మేది. సా చ భూమికదళీ "ద్రోణపర్ణీ స్నిగ్ధకన్దా కన్దలీ భూకదళ్యపి" ఇతి శబ్దార్ణవోక్తేః. "ధ్వజాంశుకైః ప్రస్ఫురితైః కన్దలీ వనైః"-మాఘః; "ఆవిర్భూతప్రథమముకుళాః కన్దలీశ్చానుకచ్ఛమ్" మేఘ. పుష్పే చ. "ఏడమ్బ్యమానా నవకన్దలైస్సా" రఘుః. "ద్విరదైః కన్దలకమ్పనలాలితైః" మాఘ. "నిష్ఠ్యూతకేన్దుకరకన్దళజోఽనుసేకః" ఉత్తరరామ.

భూమికన్దలీ— స్త్రీ. భూమిలగ్నా కన్దలీ శా. త. కన్దలీభేదే—మాఘః ౬-౩౧, మల్లి.

"అభ్యుల్లసత్కలికా వనరాజిరుచ్చైః"—మాఘః.

కన్దలీకుసుమ. న. కన్దల్యాఇవ కుసుమమస్య శిలీన్ధ్రి ౬ త. భూమికదలీపుష్పే చ. ద్రోణపర్ణీ-భూమికదల్యామ్ శబ్దార్థ.

శిలీన్ధ్రి— న. శిలీంధ్రరతి, ధృ. క. పృషోదరాదిః. ముష్. ౧. కదలీపుష్పే, ౨. కవకే చ-మేది. ౩. త్రిపుటాయాం-విశ్వ.

నవకందళీకుసుమము ఎఱుపుగదా, అరఁటిపువ్వు ముదిరిననేగాని ఎఱ్ఱపడదు.

శిలీంధ్రము కేవల మెఱుపుగాదు తెలుపు గలసిన యెఱుపు "పాయంతవదీపపాటలాభము" గదా. కావుననే "అరుణశ్యామధారయద్భి శ్శిలీన్ధ్రైః" అనుట "అశ్వేతరాగ స్త్వరుణః శ్వేతరక్తస్తు పాటలః" అని యమరము. కావుననే రఘువులో కందళీకుసుమమునకు "విపాహ ధూమ్రారుణాలోచనా" యుపమేయము సరిపొంది యున్నది. అట్లే విక్రమోర్వశిలో "ఆరక్త" యనినం పాటలమని గ్రహింపఁదగి యున్నది.

"రక్తశిలీన్ధ్రజాలైః" అన్నచోట నేత్రసాదృశ్యముంబట్టి రక్తశబ్దము పాటలపరమనియే గ్రహింపవలెను.

శిలీంధ్రమనఁ గపురపు టరఁటిపువ్వని యేనియును వాదింప వలనుగాదు. తొలిది యెఱుపు, కాఁడది తెలుపు గదా.

"అడవి యరఁటి వానలలోనేగాని పూవదు; మన యరఁటులు నీటివసతివృద్ధిచే నెప్పుడును బూచును కావున కందళి(కాటి) యరఁటి గాఁదగును." అని వాదింపఁ దగదు. కందళి అనూపజముగదా.

ఒకవేళ కబ్బంబుల నెట్టులేనియును సార్వకాలికం బగుటం గదళికి వర్షర్తువునం బ్రస్తావము కనంబడినను, అంతమాత్రాన దానికిని కందళికిని అభేదము లభింపదు; తత్కుసుమంబును శిలీంధ్రము గానేరదు.

అకారాది నిఘంటువులందు శిలీంధ్రమన నరఁటి పువ్వను వివరణమునకు గతియేమన :—

Vaidya (వైద్యుని నిఘంటువులో)

కదళ I. m. n. 6. the plantain tree; కదళ దళోల్లాసాః పయోబిన్దవః. Am. S. 48.

III. N. A. Kandala flower. R. XIII.22.

కదళీ. f. 1. The plantain tree or the banana tree. కదళీస్తమ్భకల్పా జఙ్ఘాః. Megha I. 21. Rt. II. 5.

కదళీకుసుమము. n. A mushroom.

శిలీన్ధ్ర II. n. 1. A mushroom 'కర్తుం యచ్చ ప్రభవతి మహీ ముచ్ఛిలీన్ధ్రా మవన్ధ్యామ్.' 2. The flower of the plantain tree: 'అధిపురన్ధ్రి శిలీన్ధ్ర సుగన్ధయః.' Sis. VI. 32. 'అలివారమతాలిని శిలీన్ధ్రే' 72

శిలీన్ధ్రక. n. A mushroom.

ఇట కందళదళములన నరఁటియాకులని వైద్యుని యాశయముగాఁ గన్పట్టుచున్నది. కందళిపుష్పము యొక్క రేకులన్న యెఱుపల మల్లినాథసూరి యభిప్రాయమునకు సరిపడును. ఎట్లన "కన్దళదళోల్లాసాః" అను నీహోటంబోలె తొలితొలి వానచినుకులకార్యము మాఘములో వర్ణితమైన "ప్రవసతి ప్వుతరాం" అను శ్లోకమున కందళ మనఁగా భూకదళీపుష్పమని మల్లినాథసూరి వివరించినాఁడు. ఇట చెట్టనం గారణమిదేమి యగపడదు

వైద్యుఁ డిట కందళశబ్దమునకు మఱియొక యర్థముగా "A Kandala flower" అని వ్రాసినాఁడు; "A plantain flower" అని వ్రాయఁడాయెను. దానం జేసి కందళమన నరఁటిపువ్వు గాదని వైద్యుని యాశయముగా నగపడుచున్నది. మల్లినాథుఁడు "విడమ్బ్యశ్యామా నవకన్దలైః" అన్నచోఁ గందళమునకు ఏయర్థమును ఏప్రమాణమును వ్రాసినాఁడో "విశేకందళ" యన్నచోటను ఆయర్థమునే ఆప్రమాణమునే వ్రాసినాఁడు. ఇట్లు అరఁటికిని అభేదము తదభిమతమైయుండ వైద్యుఁడు అట్టివేయును నీరెంటను ఇట భేదము తలఁచినాఁడు. భేద మనుపపన్నము.

ఇది యిట్లుండ రఘువంశమును హూణభాష ననువదించిన పండితుఁడు ఇచ్చోట plantain flowers అనక "Kandali flowers" అని అనువదించి కందళము అరఁటిపువ్వు గాదనుట తెలిపినాఁడు.

మఱియును మల్లినాథసూరి రఘువులో "నవకన్దలైః", మేఘములో "కన్దలీశ్చానుకచ్ఛమ్" అను రెండు తావులను వ్రాసిన వివరణములచే కందళి యేచెట్టో కందళము అపుష్పమని తెల్పియుండఁగా వైద్యుఁడు చెట్టు అరఁటి యనియును, పువ్వు అరఁటి కాదనియును వ్రాసినాఁడు.

మఱియును, మల్లినాథసూరి "ఉచ్ఛిలీంధ్రామసస్థాః" యన్నచోట నేయర్థమును ఏ ప్రమాణముతో చెప్పినాఁడో "శిలీంధ్రసుగంధిభిః" అన్నచోటను ఆ యర్థమునే ఆప్రమాణముతోనే నిరూపించినాఁడు. వైద్యుఁడు ఉచ్ఛిలీంధ్రాః అను స్థలమున "A mushroom" అనఁగా పుట్టగొడుగని యర్థము వ్రాసినాఁడు. దానిబట్టి మాఘ శ్లోకమందును "శిలీంధ్రసుగంధిభిః" అనుచోట పుట్టగొడుగే అర్థము కావలయును. దానికి అనఁగా పుట్టకొక్కునకు పరిమళమును అత్యంతవిరహోద్దీపకపరిమళమును ఈ ప్రయోగమువలననే సాధింపనగును. ఇట్టి యర్థములు ఈ యాధునికాకారాదినిఘంటుకారులు ప్రమాణీకరించిన ఫలము.

మఱియు, పైఁజెప్పిన రెండుతావులను ఏకార్థము మల్లినాథవ్యాఖ్యలచే సిద్ధమైయుండఁగా తద్విరుద్ధముగా వైద్యుఁడు మేఘమునం బుట్టకొక్కనియు, మాఘమున నరఁటిపూవనియు వ్రాయుట పొరఁబాటుగా నున్నది. ఈ యర్థములలో పుట్టగొడుగే రెంటను అర్థమందురేని మల్లినాథసూరి "శిలీంధ్రసుగంధిభిః" అన్నచో నేపర్యాయపద మర్థముగా వ్రాసెనో "అళినారతమతాళినీ శిలీంధ్రే" అన్నచోటను అపర్యాయపదముచేతనే యర్థముం జెప్పెను. కాన నీమూఁడుతావులను ఏకపదార్థమే వర్ణితమని తలంచుట న్యాయ్యమైయున్నది. ఇందు మూఁడవతావున శిలీంధ్రము "పాయంశీనదీపపాటలాభము" గదా. దానం జేసి, మూఁడునుం బుట్టగొడుగయేని, పుట్టగొడుగు ఎఱుపని యేర్పడుచున్నది; ఇది యనుభవవిరుద్ధము. కాన నీ మూఁడుతావులనుం బుట్టగొడుగుగాదు. మూఁడుతావులను అరఁటిగాదన నుపపత్తి తదీయవార్ణికత్వమును, మల్లినాథసూరి శిలీంధ్రమున కెనటను పర్యాయముగా కదళిని వ్రాయక కందళినే వ్రాయుటయు.

మఱియు శిలీంధ్రమునం దుమ్మెదలు క్రీడించునవియు, అది పాటలవర్ణియు మూఁడవ తావున వర్ణితము గదా, పాటలమనఁగా శ్వేతరక్తము. అరఁటిపూవు డొప్పవిడువనిచో అలికి మకరందాదికము నొసంగదు. డొప్పవిడిచినతరిని డొప్పగాటపు టెఱుపుగా నుండును, నలుపు మిగిలియుండును గాని తెలుపు మిగిలియుండదు. కాన నిట నరఁటిపూవు కానేరదు. "అపరిమితానురాగకుసుమనోలస" గదా "రంధ్ర". దీన వైద్యుఁడు శిలీంధ్రశబ్దార్థములకు తా వ్రాసిన రెండు మూఁడు ప్రమాణముల యర్థమును తాను సరిగా గ్రహింపమి విశదమగుచున్నది. కదళీ కందళీ శబ్దములకుం గల ధ్వనిసామ్యవర్ణసామ్యము ఈ యకారాదినిఘంటుకారాదుల యీ పొరఁబాటునకుం గారణముగాఁబోలును!

ఇదుల కింకొక యుదాహరణముం జెప్పెద:

అమరములో అజినయోని హరిణజాతి విశేషములు ఇట్లు చెప్పబడి యున్నవి.

"కదళీ కన్దళీ చీన శ్చమూరు ప్రియకావపి,
సమూరు శ్చేతి హరిణా అమీ అజినయోనయః."

ఇందులకు గురుబాలప్రబోధికలో "కదళీ శబ్దము మొదలు ౬ ఆస్తరణాదులకు ఉపయోగించు చర్మమునకుఁ గారణము లైన యిఱ్ఱిజాతి విశేషముల పేర్లు" అని కదళీ కందళీశబ్దములు భిన్నవాచకములుగాఁ జెప్పఁబడి యున్నవి. అట్లే రామాశ్రమీయమందును భేదమే చెప్పఁబడి యున్నది. ఆధునిక విద్వద్వరేణ్య ప్రణీతాకారాది నిఘంటువులం గొన్నింట కదళీకందళీ శబ్దములకు రెంటికిని వింశత్యంగుళోన్నతకురంగవిశేష మర్థముగాన భిన్నవాచకత చెప్పఁబడినది. అట్లే శిలీంధ్రవివరణంబులం గల కందళీశబ్దము ముద్రాలపు లేఖకాదికుల ప్రమాదంబులంజేసి కదళీశబ్దముగా పరిణమించి రాఁగా రాఁగా శిలీంధ్రము కందళీపుష్పత్వముం గోలుపోయి కదళీపుష్పమై తుదకీ యకారాది నిఘంటువులందు అరఁటిపువ్వయినది గావలయును. బొంబాయిలో ముద్రితమయిన మాలతీమాధవమునంగల త్రిపురారిజగద్ధరవ్యాఖ్యలలో "శిలీంధ్రం కన్దళీపుష్పమ్" అని కన్దళీశబ్దముతోనే విశ్వనిఘంటువు ప్రదర్శింపఁబడి యున్నది; కదళీశబ్దముతోఁ గాదు. మాఘమేఘముల నాగరపుస్తకములలోను కందళి యనియే శిలీంధ్రవివరణ మున్నదిగాని కదళియని యుండలేదు. కావ్యగ్రంథములయందు పర్యాయపదముగా కందళికలదేగాని కదళి లేదు. కావ్యగ్రంథంబులయందు ప్రకృతవార్ణికోద్భిద్విశేష తత్కుసుమవాచకంబులుగా ఛందోబద్ధంబు

లై యాసంగ్రధరూపంబులై కదళీ కందళీకుసుమ శిలీంధ్ర శబ్దంబులే యుండుటయు, కదళియేనియు తత్పర్యాయాంబులు రంభాదికంబు లేవియు లేమియుం గన నగును. దానింబట్టియు విచారింప కందళియే ప్రకృత శబ్దముగాని కదళి గాదనియు, ఎవరి ప్రమాదంబుననో అది కాలక్రమమున కదళిగా విద్వాంసుల యకారాది నిఘంటువులలో పడినదనియు తోఁచుచున్నది. ఒక్క పొరఁబాటు ఇన్ని యాధునికనిఘంటువుల దు చెక్కనట వింతగాదా యందురేని, వింతగాదు; ఎట్లన చిత్తగింపుఁడు. ఈ యాధునికాకారాదినిఘంటువులకెల్ల ముందుది, ఒండె, ముదుని, ఆగరములు. కాన తొలి నొక్కింటఁ గల్గిన ప్రమాదము కడను యన్నిటను చెక్కినట్లు ప్రాయికము ఈ కదళీకందళుల యభేదభ్రమకు "కదళీ కన్దళీ చీనః" అను కోశగల "కదళీ కన్దళీ" యను ముక్కయుం గారణమై యున్న నుండవచ్చును. అట్టి పొరఁబాటును గలుగునా యని యాశ్చర్యమేని, ఆ పొరఁబాటును ఈ యకారాది నిఘంటుకారులు చేసిరని నామాట గాదు, అట్లో యిట్లో జనించి యా పొరఁబాటు తుదకు నీ గ్రంథములందు సంక్రమించి యుండునని నా తలంపు. ఈ క్రింది గ్రంథముల గనుఁడు:

| | |
|---|---|
| శాకుంతలము | కాళిదాసీయము |
| ఆంధ్రశాకుంతలము | వీరేశలింగీయము |
| ,, | నాసీయము |
| ,, | శ్రీరామీయము |
| ,, | వేంకటరాజీయము |

ఇందు నడిమూఁటను వస్తువొక్కటియే; చిగురని యు, మొగ్గయనియు నిఘంటువుల పర్యాయము పేర్కొనంబడి యున్నది. అంతటను మొగ్గయేగాని చిగురుగాదని తుదిదానం దెలియుచున్నది. తొలిదాని తాత్పర్యంబు నదియయని నా మతము. దిగంబరులనాట గోచి పెట్టుకొన్నవాఁడేగదా నింద్యుఁడు.

ఉదాహృతములలో కొన్నిటికి ఇంగిలీషులో టీకలు అనువాదములు వ్రాసినవారును కొందఱు పొరఁబాట్లు గావించినారు. ఎట్లన:—రఘువంశపు ఇంగ్లీషు వ్రాసిన పండితులు కందళి యనఁగా కదళియని పొరఁబాటు పడలేదు. "నవకన్దలైః" అను దానిని "by the new flowers of Kandali" అని హూణీకరించిరి. "—of the plantain" అని హూణీకరింపలేదు. విక్రమోర్వశీ టీక వ్రాసినవారు "నవకన్దలీ" అనుచో "Plantain" అని స్పష్టముగా నిర్దేశించినారు. మూలము లోని నవశబ్ద స్వారస్యముచే నీమొలక లేఁతల వారిక మనియు, దానం జేసియే ఇది కదళి [అనఁగా Plantain] కానియు విమర్శించుకొనైరి. మేఘ హూణీకర్త "కన్దలీన్యనుకచ్ఛమ్" అనుచో "The Plantain tree" అని అనువాదము వ్రాసినాఁడు; దానికే టీకలో "Kandalis" అని టీకాకారుఁడు వ్రాసినాఁడు. ముద్రితప్రకారంబున హూణీకర్తయు టీకాకర్తయు నొక్కరుండగా నున్నది. కాని యీభేదంబుం గన విద్వాంసులు పండితులు రెండుపక్షంబులుం గావించినట్లు తెలంపందగియున్నది. "ఉచ్ఛిలీన్ధ్రాన్" అన్నచో "mushrooms" అని యనువాదము వ్రాయఁబడి యున్నది. అది పొరఁబాటని సోపపత్తికముగా దెలిపియే యున్నాఁడఁగదా.

ఆంధ్రించినవారు ఇట్టి పొరఁబాటులు సేయక "విదళకన్దళ" యను దానికి "విదళకందళ" యనియు "శిలీంధ్రకుసుమగన్ధిభిః" అంటను "కందళీకుసుమగంధ యుతంబులునై" అనియు, "అళినీశిలీంధ్రే" అనుదానికి "మడంగ్రోలంపతుల్—ప్రణుతశిలీంధ్ర పుష్పముల" అనియు సరిగానే రచించినారు.

మాలతీటీకలో శిలీంధ్రమనఁగా పున్నాగవిశేష మని వివరణము ముద్రితము. అందులకు ప్రమాణముగా పున్నాగశబ్దమేని తత్పర్యాయమేనియు లేనిది విశ్వనిఘంటువాక్యము ముద్రితమై యున్నది. అందు శిలీంధ్ర శబ్దమునకు కందళీకుసుమము, వడగల్లు, వర్షాకాలపు మల్లెయు నను మూఁడు అర్థములు చెప్పఁబడియున్నవి. ఇందొకటియు పున్నాగమేని, పున్నాగవిశేషం బేని యుం గాదు. కావున "పున్నాగ" యనుమాట ముద్రణములో 'పుష్ప'యనుటకు పొరఁబాటుగా పడియుండ

నోపు. ఆ వ్యాఖ్యయందే "రక్తపుష్పత్వస్యే" అనుటం గన త్రిపురారికాలమునకే శిలీంధ్రమును రక్తపుష్పమని తెలియు పొరఁబాటు కలిగియుండుననియు, అందులకుం బ్రమాణము గానరామి నాతఁడు దానిని గ్రహింపలేదని యు చెప్పవలసి యున్నది. ధూరంధ యనుటకు అచ్చు లో ధూపదముం దొలఁగించిరో యనియు సంశయింపఁ దగియున్నది. ఈ పుష్పమేదో రూఢిచేసికొనఁజాలక త్రిపురారి యిన్ని వ్రాఁతలు వ్రాసెనని తోఁచెడిని.

మఱి యీకందళి యను మొలక యేమొలక యనఁగా—ఇట్లు తోఁచెడిని.

కదళీపర్యాయములలో సెటుకు ధూకదళి కాన రాదు, కందళీపర్యాయములలో ధూకదళి కలదు. మాఘమేఘముల కింటరం గందళిని ధూకదళి యనియే మల్లినాథసూరి వ్రాసెనుగదా. రంటను ధూమిశబ్దము మానక చెప్పలేరుగదా. స్వార్థమందు, ధూమియనఁ గా ధూమియనియు, ధూవంద్రుఁడనగా చంద్రుఁడని యు, ధూకాకమనం గాకమనియు, నిష్ప్రయోజనార్థముగా ధూశబ్దము పూర్వపదముగాఁ బ్రయోగింపంబడునని వాదించువారితో నేను డీకొనను. వేమెట్లు నేలవేము గాదో, తాడి యెట్లు నేలతాడిగాదో అట్లే కదళియు ధూకదళి గాదు [కందళి గాదు, శిలీంధ్రము గాదు] అనుట న్యాయ్యము. నేలవేపదూలమువంటు, నేలతాడి మొంటెలును లేవుగదా. వృక్షవిశేషవాచకములకు పూర్వ పదముగా ప్రయుక్తమగు ధూవాచకము క్షుద్రత్వ ద్యోతకముగా నుదాహరణములం దగపడుచున్నది. "ధూఃఖర్జూరీ = క్షుద్రఖర్జూరి", ధూధాత్రీ=ధూమ్యామ లకీ,="నేలయుసిరిక". ఉసిరిక మహావృక్షము, నేలయుసి రిక లొడితెడు మొలక. "ధూనిమ్బః = నేలవేము" వేము మహావృక్షము, నేలవేము లొడితెడు మొలక; అట్లే ధూ కదళికి అనఁగా కందళికి చెప్పిన వర్ణనలకు ఒప్పునట్టిది నేలయరఁటి యని యొకటి కలదు. అదియే యామాట కర్థమని పెద్దలునుం జెప్పుట కలదు. దాని యాకులు అరఁటియాకులవలె నుండును కాని, చిన్నవి; చెట్టును అరఁటిచెట్టువలెనే యుండును గాని, చిన్నది దానిపుష్ప మకులజీబులో దాఁగియుండక, మీదికి నిగిడియుండు ను ఎఱ్ఱగా నుండును. అది వార్షికము, తోఁటపెట్టం దగినది గాదు. కాన పెద్దలమాటబడి దానినే కందళీ శబ్దార్థముగాఁ గొనుట యుచితము.

మఱి శిలీంధ్రమేమయిన మనకేమి, అరగడకు ఈరగడ యేల? పుష్పమాత్ర సాధారణంబగు పరిమళము మోచాకుసుమమునకు (అరఁటిపువ్వునకు) ఏల యొప్పఁగూ రదు, అని యాక్షేపకమేని,—మోచయన వరఁటియు కాల్మలియును; రెండింటి పువ్వులును ఎఱుపు. పుష్పమాత్ర మునకు పరిమళము సిద్ధంబయినను ఎఱ్ఱపూవులకు అది లేమి ప్రసిద్ధము. అట్లే యభియుక్తుల యనుభవసారోక్తి. Bain's Induction. P. 52.

In flowers there is a remarkable concurrence between the scarlet colour and the absence of fragrance. The followin; quotation gives a selection of instances.

'Among all the colours that blooms assume none are less associated with fragrance than scarlet. We cannot at present recollect a bright scarlet blossom that is sweet scented—yet no other colou- among flowers is more admired and sought after. Scarlet prevails among Balsamina, Euphorbia, Pelargonium, Foppy, Salvria, Bouvardia, and Verbena; yet none of the scarlets are of sweet perfumes. Some of the light-coloured Balsams and Verbenas are sweet-scented, but none of the scarlets are. The commonsage with blue blossoms, is odoriferous both in flower and foliage; but the scarlet Salvias are devoid of smell. None of the sweetr scentedleaved Pelargoniums have scarlet blooms, and none of the scarlet bloomers have sweet scent of leaves nor of blooms. Some of the white-margined Poppies have pleasaut odours; but the British scarlets are not sweet-scented. The British white blooming Hawthorn is of the most delightful fragrance; the scarlet flowering has no

smell. Some of the Honey suckles are sweetly perfumed, but the Scarlet Trumpet is scentless.' (Elder, American Gardener's Monthly).

మనకు కింశుకాదుల పరిమళాభావము అనుభవసిద్ధమేగదా, ఉక్తిసిద్ధంబును. "నిర్గంధా ఇవ కింశుకాః". పూర్వోక్త 'చేమ' వాక్యంబువలన ఎఱుపు కాఱెఱుపు గాక ఇంచుక తెల్పునైరై యితరవర్ణములు ఏవేని మిశ్రములై యున్న పువ్వులకు గొజ్జెఁగ లోనగువానికిం బరిమళము అనుపపన్నము కాదు. అట్లే పూర్వోక్త శిలీంధ్రము పలాశమువలె కేవలము "అతిలోహితము" గాక, "పాటలాభము" గావున దానికిం బరిమళము ఉపపన్నము. అరఁటిపూవును బూరుగుఁబూవును కాఱెఱుపులు, గాన వానికిం బరిమళము ఉపపన్నము గాదు. ఈ యుపపత్తులను అభియుక్తోక్తులు నేల, అనుభవముచే నరఁటిదేని, బూరుగేని, రెండునేని, పరిమళవంతములు గాఁగూడదా యని యధిక్షేపమేని—వినుఁడు:

అనుభవమే సర్వోత్కృష్టప్రమాణము, అరఁటిపూవునకును, బూరుగుపూవునకును పరిమళము లేమి యనుభవసిద్ధము. ప్రమాణసిద్ధము, పంచభూతగుణము బగు నీపువ్వంబున పృథివీభూతసంబంధి యగు గంధమేమాయెను? ఆ గంధము లేకపోలేదు. కాని, ఈ యరఁటిబూరుగుల గంధము నలిపి ముక్కులో నలంమూర్చికొని తెలియఁబడ్డవలెగాని యింపుకొనియు తెలియరాదు. ఆ యింపుకరము పరిమళము గాదు. ఆమోదమనంబడునది కానేగాదు; అనఁగా మనుష్యఘ్రాణేంద్రియ గోచరంబుగా గాలిలోఁ జేరి వ్యాపించునది కానే గాదు. "శిలీంధ్రసుగన్ధిభిః వనవాయుభిః"

"విమర్దోత్థే పరిమళో గన్ధే జనమనోహరే,
ఆమోదస్సోఽతినిర్హారీ............
సమాకర్షీ తు నిర్హారీ సురభిర్ఘ్రాణతర్పణః."

—అమరము.

"పరిమళః=నానాద్రవ్యములను మెదుపుటవలనఁబుట్టినదై జనులకు మనోహరమయిన గంధము పేరు. ఆమోదః—అతినిర్హారీసః=మిక్కిలి దూరముగా వ్యాపించునట్టియా పరిమళము పేరు" అని టీక.

మల్లె, సంపెఁగ, గొజ్జెంగ - ఏనమాదులను వాసన కలవనే ఇరువది ముప్పది యడుగుల దూరమునుండియే కనులం గాంచకయే కలవని తెలియంగవచ్చును. వాని వాసనయు కరమభిలషణీయము, కానసే వానిని లోకులు శ్రమపడియేనియు సంపాదించి చెంతఁ జేర్చుకొందురు, ధరింతురుగదా. అరఁటిబూరుగుల యునికిని ముక్కుచే తెలియఁగఁదరమేగాని చారసులోనే యున్నను వాసనచే తెలియంగఁ దరముగాదు. పరిమళార్థమెవ్వరును అరఁటిబూరుగులను చెంత నుంచుకొనుట నిప్పటికింకఁగని విని యెఱుంగము. గొజ్జెంగను సేవంగింపోలె బూరుఁగును అరఁటిని (కత్తిరించి) జడయల్లుకొను భాగ్యశాలినులు లేరు.

అరఁటిపూరేకులు కొలువంగల్గు పాలకు ఇంచుక వాసన కలదు, అదియును ఒకగజము దూరమేని ప్రసరింపఁజాలదు, అభిలషణీయమునుం గాదు. దానిని తొలియవం జనరు. అది—వెగటుగా నయిదోను ఉండును. [ఈ యనుభవంబువలనే శిలీంధ్రమునకు నరఁటి గాదని తెలియంగం దగును]. సుగంధియరఁటి యను వ్యవహారము ఫలప్రయుక్తము గాని పుష్పప్రయుక్తము గాదు అట్టియీ పువ్వునకు పరిమళము చెప్పుటయు, అందును అత్యంతమదనోద్దీపక పరిమళముం జెప్పుటయు, ఆపరిమళమునకు లోఁగని వానిని పసరమని దూఱుటయు నొప్పఁదగిన విషయములు గావు.

ఇవ్విధంబున ననుభవమునకును మహాకవుల రచనలకును విరుద్ధమయిన యరఁటిపూ పరిమళమేనియు బూరుగుపూనెత్తావియేనియు నప్రసిద్ధకవుల ప్రబంధములయం దెవ్వరేని త్రవ్వి కనిపట్టినను అయ్యది సాహసికోక్తి యని యనాదరణీయంబు.

పూర్వోక్తమయిన రామకృష్ణకవాచార్యులవారి రగడలో మోచయను సామాన్యవాచకమును సప్తపర్ణరూప విశేషాభిప్రాయకముగానేని కొందఱన్నసందులకు ప్రతిబంధకముగా వారు మోచతో మలఁతుమారుకె

